# SRI GEETHA RATNAMULU.

A Selection of the Bhagavad Gita. by

T. Ramakristna Rao Gupta F. T. S.,
Honourary Secretary Eswaropasana mandali,

With a view to propagate the Vedic Religion.

---

Printed at Bharati Vilasa Press.
Narasarowpet.
1911







జర్మనీదేశ మహావిద్వాంసులును, విమర్శకులును నగుషోపెన్‌
హాయిరుదొర గారిట్లనిరి.

"ఈ ప్రపంచములో నెల్ల నుపనిషత్తులంత పవిత్రమైనట్టియు, జీవితమును సంసార బంధమునుండి తొలగించి సర్వోత్కృష్టస్థితిని బొందించునట్టియు బరమపవిత్రగ్రంథములు లేవు. మఱియు నాయావజ్జీవితంబునందును చిత్తశాంతినిచ్చుటయేగాక సహింపరాని మరణవేదనశాంతియు గలిగించి సుఖకరంబయ్యె."

"సంస్కృతమను వనః నందు భగవద్గీత రోజాపుష్పమువలెఁ బ్రకాశించుచున్నది."

ఆనిబిసెంటు.

" Geetha is a Rose flower in the garden of Sanscrit Literature"

Annie Besant.

Schopenhauer one of the Greatest philosophical critics of Germany says,

" In the whole world there is no study so refined and so elevating asthat of the upanishads It has been the solace of my life. It will be solace of my death."

ఓం బ్రహ్మణేనమః

# గీతారత్నములు.

———:(0):———

శంకరభాష్యసహితసంక్షిప్త శ్రీమద్భగవద్గీతార్థములు



సత్యమేవజయతే — నానృతం.

“ఓమ్ బ్రహ్మకృపాహి కేవలమ్”

పరమాత్మకునమస్కారము.

శ్లో॥ యత్కీర్తనం యత్స్మరణం యదీక్షణం।
యద్వందనం యచ్ఛ్రవణం యదర్హణమ్।
లోకస్య సద్యో విధునోతి కల్మషం।
తస్మై సుభద్రశ్రవసే నమో నమః॥

ఎవ్వని కీర్తనంబును, ఎవ్వని స్మరణంబును, ఎవ్వనిఁ జూచుటయును, ఎవ్వని నమస్కరించుటయును, ఎవ్వని వినుటయును, ఎవ్వని పూజయు, అప్పుడే లోకముయొక్క పాపమును, పోగొట్టుచున్నదో, మంగళకరం బగు కీర్తిగలవానికి అను నమస్కారము. నమస్కారము.

# DEDICATION.

——:o:——

To

The Esteemed memory of the late Brahma Sri Athmoory Lakshmi Nrisimha Somayazulu Garu B.A.BL., Dt. Munsiff. "The great Vedic & Social Reformer."

This compilation is most humbly and devotedly dedicated by his admirer.

The Author.

# అంకితము.

———:0:———

ఏ మహాత్ముండీ చెన్నరాజ్యాంబున వైశ్యకుల శిరోభూషణమై యఖండ
ప్రాజ్ఞతాగ్రగామియై వైదికధర్మప్రచారము కొఱకును సంఘ
సంస్కారణము కొఱకును తనయఖండవిద్యాబలమునంతను,
ధనమును [illegible] అప్రాణాంతము వినియోగపరిచి
పాటుపడెనో యట్టి
బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులు బి.ఏ.బి.ఎల్., గారికిని
వేదమతాభివృద్ధికై శ్రమశక్తి కొలంది పాటుపడు సకలమహనీయులకు

ఈగీతారత్న సంగ్రహము కృతజ్ఞతాపూర్వముగ సమర్పింపఁబడి యంకితంబొనర్చుచున్న వాఁడను.

కాటికొండ రామకృష్ణరావుగుప్త,

ఎఫ్. టి. ఎస్

పరబ్రహ్మణేనమః.

# భగవద్గీతా మాహాత్మ్యము.

———:0:———

ఈభగవద్గీతాగ్రంథము భగవంతుండనంబరగిన శ్రీకృష్ణుండుఅర్జునున కుపదేశించిన యోగశాస్త్రమని యెల్లరకుదెల్లంబై యున్నయది. ఈశాస్త్రోపదేశమును మహాభారతయుద్ధావసరమున అర్జునుండు రెండుబలములయందున్న తనసోదరులను, సుతులను, ఆచార్యులను మొదలుగాఁగల యిష్టజనులనుచూచి పరమకృపావేశమున నత్యంతవిషాదమునుపొంది చంపనొల్లక ఆయుధములను విడిచి యుద్ధమును చేయననఁగాకృష్ణుండునర్జ

from the outer to the inner planes; and see in the field of Kurukshetra the battle-field of Soul, and in the sons of Dhritrashtra the enemies it meets in its progr ·s, Arjuna becomes the type of the struggling soul of the disciple and Sri Krishna, the type of the logos of the soul"

పైనిచ్చినవాక్యములు శీలయుతార్యానందమునకై యే
హృదయమునందున్న పాశ్చాత్య(శ్రీ)రత్నంబును హిందూమతప్రచారిణియు
నగు అనిబిసెంటుగారును చెప్పుచున్నారు.

Sri Sankara chariar says,

"God the Indweller, Vasudeva, has made Arjuna, the means or instrument to explain the philosophy for the benefit of the world

ప్రపంచమునకు తత్త్వమును బోధించుటకు ఉపకరణముగా నర్జునుని భగవంతుడు చేసెనని భగవత్పాదాచార్యులగు శ్రీజగద్గురువాదిశంకరులనుచున్నారు.

——:0:——

Sri Ramanuja chariar says,

"The Gita is intended to explain the end and aim of man by making the Pandu war (vyajena) a pretext."

"భారతయుద్ధమే వ్యాజముగా బెట్టుకొని మనుజులు మోక్షమునుబొందు మార్గమును బోధించుటకై భగవద్గీత యేర్పరుపబడినదని"

సోదరత్వముతో దయాహృదయుండై భక్తియుప్పొంగ హీనజాతివారికి సహితమాధ్యాత్మికవిద్యను బోధించిన ప్రాచీనసంఘసంస్కర్తను

రంధరులైన శ్రీరామానుజాచార్యులువారును; వేయినోళ్ళ వక్కాణిం చుచున్నారు. ఈసర్వసమ్మతమై యానందకరమై, ప్రకాశించునీభగవద్గీత శ్రీసర్వజ్ఞకృష్ణ మహాత్మ ప్రణీతంబగుటవలనను శ్రీయాజ్ఞవల్క్యాది గీతలకన్న మిన్నయై వెలుంగుచున్నయది.

మఱియునింకొక కారణంబువలనను సకలగీతాశిరోమణియై చె న్నొందెడిని అయ్యాదిసకలవేద ప్రతిపాద్యంబగు (ప్రవృత్తి) (action) నివృత్తి(in action)రూపధర్మద్వయ ప్రతిపాదకంబగుటయెమఱియు నింకొకవిశేషంబుగలదు. ఎల్లతీర్థంబులును శరీరమలమోచన ద్వారా

మనస్సునందలి రాగద్వేషాది మాలిన్యమును పోఁగొట్టునుగాని సాక్షాన్మన
శ్శుద్ధికరంబులుగావు. శ్రీభగద్గీతాతీర్థం బాత్మకు బరనిర్వాణ ప్రాప్తికి బ్రతి
బంధకంబగు రాగద్వేషాదిరూపంబగుసంసార మలమోచనద్వారంబున
బరమపదప్రాపకంబగుచున్నయది. గాననిట్టిగీతాతీర్థంబును భగవత్పరతం
త్రుండై ఫలేచ్ఛాకర్తృత్వంబులు త్యజించిభగవత్ప్రీతిసాధనంబుగాఁ అకు
స్వధర్మానుష్ఠానపూర్వకంబుగానిరంతరంబాదర పూర్వకంబుగా సేవించె
నేని సంసారదుఃఖసముద్రమునుండి దరిఁజేర్చి శాశ్వత సుఖప్రదంబగుట

ఈ సందియంబావంతయేనింగలుగదు. కానిభగవద్గీతవంటి పవిత్రగ్రంథం బీలోకంబున కాలత్రయంబుననుండదు..

ఓమ్ తత్సత్ బ్రహ్మకృపాహి కేవలమ్.

కొండ రామకృష్ణారావుగుప్త,

ఎఫ్. టి. ఎస్.

ఆర్యులారా!

కం॥ భూతలమునందుమానవ జాతికిముక్తినిడునట్టి సాధనముల నీ
గీతారత్నముకడు వి ఖ్యాతింపగుగాన దీని నైకొంద్రుబుధుల్॥

మం॥ నిగమార్థంబుల దెల్పుజ్ఞాన గరిమన్నెకొల్పుముక్తింధ్రువం
బుగనొందించును కర్మయోగముల మాపున్బాపకాంతాదిస
త్త్వగుణంబుల్పెంచుభక్తి నెరవుండత్యాఖ్యమాగావున
భగవద్గీతలమానికంబుగొనసత్యశ్రేణులన్పెదెడిన్॥

Theosophical Society
Adyar, Madras. S.
Feb 23/1911.

Dear Sir,

You may freely use my translation.

Sincerely
Annie Besant.

Address:—
T. RamakrishanaRao,
Narasarowpet.

దివ్యజ్ఞాన సమాజము
అడయారు చెన్నపురి
23 ఫిబ్రవరి 1901.

ప్రియమైన

మీరు యిష్టానుసారముగా నా భాషాంతరీకరణము నుపయోగింపవచ్చును.

సుహృదియైన,
ఆనీ బెసంటు.

శ్లో॥ కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా।
యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ॥

## THE DESPONDENCY OF ARJUNA.

What is kingdom to us, O Govinda, what enjoyment, or even life? for whose sake we desire kingdom, enjoyments and pleasures.

"ఎవ్వాని నపేక్షించి రాజ్యము భోగములు సుఖములును కోరుచు

డునోయట్టి రాజ్యములోగాని భోగములలోగాని బ్రతుకులోగాని ప్ర
యోజనమేమి? ఓగోవిందుఁడా చెప్పుము?

అర్జున సాంఖ్యయోగోనామ ద్వితీయోధ్యాయః.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే।

3

## YOGA BY THE SANKHYA.

He is not born, nor both he die; nor having been, ceaseth he any more to be; uuborn, perpetual, eternal and ancient, he is not slain when the body is slaughtered.

ఈయాత్మపుట్టుకలేనివాఁడు, ఎప్పుడునుండెడివాడు శాశ్వతమైన వాడు (eternal) యీయాత్మపుట్టుకలేనివాడు మృతిబొందదు ఈ యాత్మపుట్టిమరల కాఁగలవాడునుగాదు, దేహమునంహరింపఁబడుచుం డగాఁ చంపబడదు, గానదేహము మారుచున్నను ఈయాత్మమారదు.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి॥

Thy business is with the action only, never with its fruits; so let not the fruit of action be thy motive, nor be thou to inaction attached.

నీకుఁగర్మ చేయుటయందే అధికారము (యోగ్యత) గాని యట్టికర్మవల్ల కలుగుఫలము (మంచిచెడుగు) నందెప్పుడును అధికారములేదు. కర్మచేసిదానివలన ఫలమును బుట్టించుటకు కారణముకాకుము నేను కర్మ చేయను అనుపట్టుదల (ఆసక్తి) నీకుండరాదు.

(నీకు కర్మయందే యధికారము కలదుగాని (జ్ఞాననిష్ఠయందు లేదు) ఈ ప్రకారము కర్మ చేయుచునుండు నీకు ఫలములయం దాశ యుండకూడదు ఎప్పుడైతేని కర్మఫలములయం దాశయుంచుదువో యప్పుడే నీవు ఆ ఫల ప్రాప్తికి హేతువగుదువు) ఈ ప్రకారము నీవు కర్మఫలప్రాప్తికి హేతువు వు కావలదు. "నీకు కర్మఫలము ఇష్టము కానప్పుడు దుఃఖరూపమైన[illegible] కర్మ యేలయని కర్మ చేయక పోవుటయందు ప్రీతియుండకూడదు. లోక మునందు జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠయని నిష్ఠలు రెండువిధములు; శమ, దమాది సాధనసంపత్తిగల సన్న్యాసికి జ్ఞాననిష్ఠయందధికారము గృహస్థునికి కర్మ నిష్ఠయందధికారము కలదు. అర్జునుడు గృహస్థుడు గావున నతనికి జ్ఞానని

ష్ఠయందధికారములేదు. కర్మనిష్ఠయందేయధికారమున్నది. కర్మనిష్ఠయనగా ఫలములయందాశలేకవర్ణవిహితములైన కర్మలనుశ్రద్ధతోఁజేయుట.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వంయోగ ఉచ్యతే॥

Perform action, O Dhananjaya, dwelling in union with the divine renouncing attacchments and balanced evenly in success and failure: eq-uilibrium is called yoga.

ఓఅర్జునుడా! ఫలాశలేకుండఁ జేయఁబడుకర్మ చిత్తశుద్ధిద్వారా జ్ఞానప్రాప్తిలక్షణమైన సిద్ధికి (ఫలము) హేతువగును. ఇట్టిసిద్ధియందు, ఇట్టిసిద్ధికలుగకపోవుటయందు సమానభక్తికలవాఁడవై కర్మలను కేవలము ఈశ్వరార్పణముగఁ జేయవలసినది. అంతైనను నేను ఈకర్మచేత నీశ్వరుఁడు సంతోషించుగాకయను సంకల్పముండఁగూడదు. ఇదెకర్మయోగము.

శ్లో॥ ప్రజహాతియదా కామాన్సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టస్స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥

When a man abandoneth, O Pârtha, all the desires of the heart, and is satisfied in the Self by the Self, then is he called stable in mind.

ఓ పార్థుడా! మనస్సునకుగలుగు సమస్తకోర్కెలను వదలి (ఆనందరూపుడైన) తనయందు తానే (సంతోషించువాడు) తృప్తినొందువాడు అనగా నేనే బ్రహ్మమను స్థిరమైనజ్ఞానముగలవాడు స్థితప్రజ్ఞుడనబడు.

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః।

వీతరాగభయక్రోధస్స్థితధీర్ముని రుచ్యతే॥

He whose mind (Manah) is free from anxiety amid pains, indifferent amid pleasures, loosed from passion, fear and anger, is called a sage (A Muni)of stable mind.

దుఃఖములు సంప్రాప్తములైనప్పుడు మనోవ్యాకులతలేనివాఁడును సుఖములయందాశలేనివాఁడును (రాగము) ప్రీతి, భయము, కోపము, (క్రోధము) లేనివాఁడైనిశ్చల బుద్ధిగలజ్ఞాని సన్యాసి (స్థితప్రజ్ఞుడు) యనంబడును.

శ్లో॥ యదాసంహరతే చాయం కూర్మో౽ఙ్గానీవసర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా।

When, again, as a tortoise draws in on all sides its limbs, he withdraws his senses from the objects of sense, then is his understanding (Prajna) well poised.

సన్యాసి యెప్పుడును తాబేలు (కూర్మమువలె) తన యంగముల ను ముడుచికొనునట్లు సమస్తమైనవిషయములనుండి యింద్రియములను

యెప్పుడుమరలించునో అప్పుడుజ్ఞానము ‘ప్రతిష్ఠితము’ మిట్లు చెప్ప
చినవాక్యసంబద్ధము.

శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥

O son of Kunti, the excited senses f even a wise man, though he be str ving, im e uously carry away his mind. (Manah)

ఓ అర్జునుఁడా! మోక్షముకొఱకు దృఢప్రయత్నము చేయుచున్నట్టి బుద్ధిమంతుఁడైన వానిని కూడ బాధించుచున్న భావముగల యింద్రియములు బలాత్కారముగా మనస్సును క్షోభింపఁజేయుచున్నవి. (లోబరుచుకొనుము)

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసస్సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥

Man, musing on the objects of sense, conceiveth an attachment to these; fr m attachment ariseth desire; from desire anger cometh forth;

శబ్దస్పర్శ, విషయములకెడమిచ్చు పురుషునికి ఆవిషయములయం దాశ (ప్రీతి) యొడముచు ఆప్రీతివలన కామము(attachment for objects) పుట్టును. ఆకామమువలన క్రోధము (ఆగ్రహము Wrath) గల్గును.

శ్లో॥ క్రోధాద్భవతిసమ్మోహస్సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి।

From anger proceedeth delusion; from delusion confused memory; from confused memory the

destruction of Reason; (Buddhi) from destruction of Reason he perishes.

క్రోధము వలన నవివేకముపుట్టును (Ignorance) అవివేకమువలన శాస్త్రములఆచార్యోపదేశములవలన నేర్చిన స్మృతి నశించును స్మృతిభ్రంశమువలనయిదిచేయనచ్చును ఇదిచేయకూడదను తెలివిగలుగుటకు కరణమునకు నాశనము గలుగును బుద్ధినాశనము గలుగుటచే పురుషుడుపురుషార్థము సంపాదింపలేక నశించును.

శ్లో॥ రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్।

ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి।

But the disciplined self, moving among sense objects with senses free from attraction and repulsion, mastered by the Self, goeth to peace.

మోక్షేచ్ఛగలవాఁడు రాగద్వేషములు లేని చెవులు కనులు మొదలయిన యింద్రియములవలనఁబట్టుకొని దేహస్థితిహేతువులయిన, అన్నపానాది విషయముల ననుభవించుచున్నవాఁడై స్వాధీనమైన మనస్సుగలవాఁడై యంతఃకరణ పరిశుద్ధతఁబొందుచున్నాఁడు.

శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య నచాయుక్తస్యభావనా।
నచాభావయతశ్శాన్తిరశాన్తస్య కుతస్సుఖమ్॥

There is no Pure Reason for the non-harmonised, nor for the non-harmonised is there concentration; (Bhavana) for him without concentration there is no peace, and for the unpeaceful how can there be happiness?

చిత్త సమాధానము (Mind in contemplation) లేని

వానికి ఆత్మస్వరూప విషయమైన బుద్ధికలుగదుఁ ఆత్మజ్ఞానమునందుఁబట్టుదలకూడ నబ్బదు ఇట్లాత్మజ్ఞానమునందుఁబట్టుదలలేనివానికి శాంతికలుగదు. శాంతిలేనివానికి బ్రహ్మానందసుఖములేదు.

శ్లో॥ ఇన్ద్రియాణాం హి చరతాంయన్మనోఽనువిధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి॥

Such of the roving senses as the mind(Manah) yieldeth to, that hurries away the understanding (Prajna) just as the gale hurries away a ship upon the waters.

ఇంద్రియములు తమతమవిషయములయందుఁ బ్రవర్తించుచున్నప్పుడా యింద్రియములననుసరించి మనస్సుకూడ విషయములకు లోఁబడిపోవును అందువలనఁ దత్త్వవిషయవిచారబుద్ధిని నీటియందునావను బ్రతికూలవాయువువలె హరించును.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

Therefore, O mighty-armed, whose senses are all completely restrained from the objects

of sense,of him the understanding is well poised

ఆకారణమువలననే యో యర్జునా! యెవని యొక్క యింద్రియములు సమస్తవిషయములనుండి మరలింపఁబడునో యట్టివాని ప్రజ్ఞ స్థిరమగును అనగా స్థితప్రజ్ఞుఁడగును.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥

That which is the night of all beings, for the disciplined man is the time of waking; when

other beings are waking, then is it night for the sage who seeth (The sage is awake to things over which the ordinary man sleeps, and the eyes of the sage are open to truths shut out from the common vision, while vice versa that which is real for the masses is illusion for the sage)

సమస్తభూతములు వసద్వస్తువునందు జాగరూకతతో వర్తించును ఆ ట్టిది స్థితప్రజ్ఞునకు రాత్రివలెఁ గానరాని దగును. అనఁగా నజ్ఞానికి పరమా

ర్థము విషయము (గోచరము) గావటుల జ్ఞానికిఁ బ్రపంచము విషయము
గాదు జ్ఞానికి బరమార్థము గోచరమగుగాని యజ్ఞానికట్లు కానేరదు. సమ
స్తభూతములకుఁ బరమార్థతత్త్వము రాత్రివలెఁ బ్రకాశము లేనిదగుచున్నది.
కాని యట్టితత్త్వము స్థితప్రజ్ఞునకుఁ బ్రకాశమగుచున్నది.(అత్మభిన్నమైన వ
లౌకిక క్రియసమస్తవ్యవహారములు సమస్తభూతములకుఁ బగలువలెఁ బ్ర
కాశములగుచున్నవి. ఈవ్యవహారము స్థితప్రజ్ఞునివిషయము కానిది. రాక్ష
సుల కేదిరాత్రియో యదిమనుజులగుమనకుఁ బగలుగాను మనకేదిపగలో
యది రాక్షసులకు రాత్రియగును. అప్రకారము స్థితప్రజ్ఞుని కెద్ది రాత్రివలె
నగోచరమైనదో యది (యవఁగావ్యవహారము) సమస్తప్రజలకుఁ బగలు

వలె నగోచరమైనది. ఏదిసమస్తమైన ప్రజలకురాత్రివలెనగోచరమైనదో యది (యనఁగాఁబరమార్థ) స్థితప్రజ్ఞునికిఁ బగలువలె గోచరమైనది. (అనఁగాభూతములకు బ్రహ్మ రాత్రి) వ్యవహారమైన పగలు) స్థితప్రజ్ఞునికి బ్రహ్మ పగలు వ్యవహారమే రాత్రి(స్థితప్రజ్ఞుం డేవిధమైనవ్యవహారము లేనివాఁడై యొప్పుచును దనయాత్మానుభవపరుఁడై యుండును. సమస్తప్రజలు నాత్మజ్ఞానశూన్యులై వ్యవహారతత్పరులై యుందురు.) కాఁబట్టి జ్ఞానికి బ్రహ్మము పగటివలెఁ బ్రకాశించుచున్నది అజ్ఞానికి బ్రహ్మము రాత్రియందలి పదార్థములవలెఁ గనఁబడుటలేదు.

23

శ్లో॥ ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ॥

He attaineth Peace, into whom all desires flow as rivers flow into the ocean, which is filled with water, but remaineth unmoved—not he who desireth desires.

ఉదకములచేతనిండి యున్నటువంటి కొండలవలెఁ గదలకున్న సముద్ర మునునదీజలములు ప్రవేశించుచున్నవి. సముద్రుని కేమియు వికారము లను గలుగఁజేయలేవు. ఆసముద్రమునందె లీనములై పోవుచున్నవి. ఆ ప్రకారముగానే సమస్తమైన కామములు సాత్మవేత్త కేమియు వికార ములను గలుగఁజేయవు. అయినయాత్మయందే లీనమైపోవుచున్నవి ఇటు వంటి యాత్మవేత్త మోక్షమును బొందుచున్నాఁడు, విషయాసక్తి (అ సంగాఁగామము) గలవాఁడు మోక్షమును బొందఁడు.

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి ని

స్పృహః । నిర్మమో నిరహంకారః స శాన్తిమధిగ
చ్ఛతి॥

Whoso forsaketh all desires and goeth onwards free from yearnings, selfless and without egoism he goeth to Peace.

సన్న్యాసియైనయేపురుషుఁడు సమస్తకామములను బొత్తుగా వదలి పెట్టి శరీరజీవనమాత్రమందయినను వాంఛలేనివాఁడయి యహంకారమును

కారములు లేనివాఁడై యుండునో యట్టివాఁడు (అస్థిరపరిగ్రహుఁడు)
మోక్షమును బొందును.

కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః.

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే॥

## THE YOGA OF ACTION.

But he, O mighty-armed, who knoweth the

essence of the divisions of the qualities and functions, holding that "the qualities move amid the qualities," (The Gunas, qualities, as sense-organs move amid the Gunas, qualities, as sense-objects. A suggested reading is "The functions dwell in the propensities." Sankarâchârya says, "of the class of qualities and the class of actions;', or the arrangement, or relations, of qualities and actions.) is not attached.

గుణవిభాగమును గర్మవిభాగమును యథార్థముగాఁ దెలిసినవాఁడు ఇంద్రియములు శబ్దాది విషయములయందుఁ బ్రవర్తించుచున్నవి. ఆత్మకాదని తెలిసికొని విషయాసక్తిని బొందఁడు.

శ్లో॥ కర్మేన్ద్రియాణి సంయమ్యయఆస్తే మనసాస్మరన్
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్సఉచ్యతే

Who sitteth, controlling the organs of action, but dwelling in his mind (Manah) on the objects of the sen ıes, that bewildered man is called a hypocrite.

ఏయాత్మజ్ఞానములేనిపురుషుఁడు చేయు కాల [illegible] లగు కర్మేంద్రియముల వ్యాపారముల నడిపి నియమింపఁబడినమనస్సుచేత విషయములను స్మరించుచుండునో యట్టిమూఢ బుద్ధిగలయాపురుషుఁడు కపటాచారుఁడనఁబడును. (అనఁగాఁగపటముతోఁగూడిన యాచారముగలఁవాఁడు)

శ్లో॥ తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥

Therefore, without attachment constantly

perform action which is duty,for,by performing action without attachment,man verily reacheth the Supreme

జ్ఞాననిష్ఠయుం దధికారివి కాకపోవుటవలననే యో యర్జునా! నీ వెల్లప్పుడుం గర్మను ఫలాపేక్ష లేనివాఁడవై చేయవలసినది. ఈప్రకారము కర్మ చేయువాఁడు చిత్తశుద్ధిద్వారా క్రమముగా మోక్షమును బొందుచున్నాఁడు.

శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।

కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్॥

As the ignorant act from attachment to action, O Bhârata, so should the wise act without attachment, desiring the welfare of the world.

ఓయర్జునుఁడా! ఆత్మజ్ఞానములేనివారు ఫలాపేక్షగలవారై కర్మల నేప్రకారముగాఁ జేయుదురో జ్ఞానముగలజనులు నావలనే కర్మలు చేయుదురుగాక. అనుతలంపుతో నక్తై ఫల మందాశలేనివారై లోకనటనకొఱకు కర్మలను జేయుదురు.

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహఙ్కారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే॥

All actions are wrought by the qualities (Gunas) of nature only. The self, deluded by egoism, (Ahamkára the separate "I am,,) thinketh: "I am the doer.,,

ప్రకృతిగుణములైన సత్త్వరజస్తమస్సులయొక్క కార్యములయిన దేహేంద్రియాదులచేతఁ జేయఁబడుచున్న లౌకికములైనట్టియు శాస్త్రీ

యములై నట్టియు సమస్త కర్మములను దానుగాని దేహేంద్రియాదులయం దుఁ దానను భ్రాంతిగలపురుషుఁడు నేనే చేయుచున్నాడననితలంచును.

జ్ఞానయోగోనామ చతుర్థోఽధ్యాయః

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః।
సబుద్ధిమాన్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్॥

## THE YOGA OF WISDOM.

He who seeth inaction in action, and action in inaction, he is wise among men, he is harmonious, even while performing all action.

వినుట, చూచుట, మొదలుగాఁగలకర్మలయందుఁ గర్మాభావము నెవఁడు
చూచునో, కర్మాభావమునందుఁ గర్మ నెవ్వఁడు చూచుచున్నాఁడో వాఁ
డు మనుష్యులందు జ్ఞానముగలవాఁడు. వాఁడే యోగి సమస్తకర్మలు జేసి
నవాఁడును నగుచున్నాఁడు అనఁగా చైతన్యశక్తితోఁ గూడుకొన్న మనా
దీంద్రియ వ్యాపారరూపమైన కర్మను గుఱించి కర్తృ గానియట్టి తనయం
దు, ఆకర్తృత్వమును - ఇంద్రియములయందుఁ గర్మకర్తృత్వమును, ఎవ్వఁడు తె
లిసికొనుచున్నాఁడో, వాఁడే జ్ఞానవంతుఁడును, సమస్తకర్మలను జేసినవాఁడ
గునని భావము.

శ్లో॥ యస్యసర్వేసమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితంబుధాః ॥

Whose works are all free from the moulding of desire, whose actions are burned up by the fire of wisdom, him the wise have called a Sage.

ఏజ్ఞానియొక్క సమస్తమైనకర్మములు కామసంకల్పరహితములైనవో, జ్ఞానమనెడియగ్ని చేఁదగులఁబెట్టఁబడిన సమస్తకర్మలుగలిగిన యవ్వానిని

యథార్థముగా పండితుఁడని విద్వాంసులు చెప్పుచున్నారు

శ్లో॥ త్యక్త్వాకర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవకిఞ్చిత్కరోతి సః ౨౦॥

Having abandoned attachment to the fruit of action, always content, nowhere seeking refuge, he is not doing anything, although doing actions.

ఎవఁడుకర్మను బ్రారంభించినతరువాతఁ బుట్టిన యాకాంక్షనముగలవాఁ

డగునో యతఁడు కర్మవ్యఁ బ్రయోజనములు గాక నాప్రాప్తింపఁదిన క
ర్మను వదలిపెట్టనేవదలిపెట్టును.ఒకవేళ నేనేరికానినువలన నాకప్పె
ట్టుటకువీలులేకపోయినట్టియిన నాకర్మయందు దానిఫలమునందు సంబంధ
మునువదలిపెట్టి విషయములయం దపేక్షలేనివాఁడు ధనపుత్రపశ్వాదిదృష్ట
(ఐహిక)ఫలములయొక్కగాని స్వర్గాద్యదృష్టఫలయొక్కగాని సాధనముల
నాశ్రయించినవాఁడైనను వాఁడేవియు గర్మలనుజేయనివాఁడే యగును

శ్లో॥ సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥

Others again into the wisdom-kindled fire of union attained by self-control, pour as sacrifice all the functions of the senses and the functions of life;

కొంతమంది సమస్తములైన యింద్రియములయొక్క కర్మలను, ప్రాణముయొక్క కర్మలను, జ్ఞానముచేఁ బ్రకాశింపఁబడినచిత్తవశీకరణరూప యోగాగ్నియందు హోమము వేయుచున్నారు

శ్లో॥ నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥

39

Verily there is no purifier in this world like wisdom; he that is perfected in yoga finds it in the SELF in due season.

జ్ఞానముతో సమానమైనట్టిపవిత్రమైనవస్తువు, ప్రపంచమందు లేదు. కర్మయోగముచేతను సమాధియోగముచేతను యోగ్యతనుబొందినపురుషుఁడట్టిజ్ఞానమును జిరకాలమునకుఁ దనయందే పొందుచున్నాఁడు.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి॥

40

The man who is full of faith (Who is intent upon faih.) Obtaineth wisdom, and he also who hath mastery over his senses; and, having obtained wisdom, he goeth swiftly to the supreme Peace.

శ్రద్ధగలవాఁడును (గురుశిష్యాదులయం దాసక్తిగలవాఁడు) ఇంద్రియములను జయించినవాఁడును జ్ఞానమును బొందుచున్నాఁడు శీఘ్రముగా మోక్షమునుగూడఁ బొందును.

శ్లో॥ బ్రహ్మార్పణంబ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌబ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవతేనగన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా॥(పా4)

The ETERNAL the oblation, the ETERNAL the clarified butter, are offered in the ETERNAL the fire by the ETERNAL; unto the ETERNAL verily shall he go who in his action meditateth wholly upon the ETERNAL. (He who sees the ETERNAL beneath the transitory alone goes to

the ETERNAL; all others remain bound in the world of forms.)

బ్రహ్మవేత్తయె సాధనముచేత నగ్నియందు హోమద్రవ్యమును సమర్పించుచున్నాడో, అది బ్రహ్మమే (యని చూచుచున్నాడు.) ఏదిహోమద్రవ్యమని బుద్ధిచే గ్రహింపబడుచున్నదో, యదియు బ్రహ్మవేత్తకు బ్రహ్మమే. బ్రహ్మరూపమైనయగ్నియందు బ్రహ్మస్వరూపమైన కర్త చేత యేది హోమము చేయబడుచున్నదో, యట్టిహోమకరణ వ్యాపారమును, బ్రహ్మమే. బ్రహ్మస్వరూపమైన కర్మయందు సమాధిగల బ్రహ్మవేత్త చేత బొందగిన ఫలమును బ్రహ్మమే.

కర్మసన్న్యాసయోగోనామ పఞ్చమోఽధ్యాయః

శ్లో॥ విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవిహస్తిని।
శుని చైవ శ్వపాకే చ పణ్డితాస్సమదర్శినః॥

## THE YOGA OF THE RFNUNCIATION OF ACTION.

Sages look equally on a Brâhmana adorned with learning and humility, a cow, an elephant, and even a dog and an outcaste. (Shva-

pâka, the lowest class of outcastes.)

విద్యలోను, ఉపశమములోను, కూడుకున్నటువంటి బ్రాహ్మణునియందు ఆవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కమాంసము తినువానియందును, పండితులు బ్రహ్మస్వరూపమునుగాఁ జూచుచున్నారు.

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతియః।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా॥

He who acteth, placing all actions in the Eternal, abondoning attachment, is unaffected

by sin as a lot s leaf by the waters.

ఎవ్వాఁడు పరమేశ్వరప్రీతికొఱకు రాజుకొఱకు ధ్యానించువాని ఫలేచ్ఛ లేక సమస్తకర్మలను జేయుచున్నాఁడో యాతఁడు నీళ్ళచేతఁ దామరాకువలెఁ గర్మఫలముచేతఁ దాను బద్ధుఁడు కాఁడు. చిత్తశుద్ధిమాత్రము పొందుచున్నాఁడు. అనగా నెవ్వఁడు ఈశ్వరార్థము కర్మ చేయుచున్నానని తలంచినవాఁడై ఫలాశను వదలిపెట్టి కర్మలను జేయుచున్నాఁడో వాఁడు పద్మపత్రము (తామరాకు) నీటిచేత నెట్లు సంబంధింపఁబడదో (నంటఁబడదో) ఆప్రకారము పాపముచే సంబంధింపఁబడఁడు.

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥

He who is harmonised by yoga, the self-purified, Self-ruled, the senses subdued, whose Self is the Self of all being, although acting he is not affected.

యోగముతోఁ గూడుకొన్నవాఁడును బరిశుద్ధమైన మనస్సుగలవాఁడును, స్వాధీనమైనదేహముగలవాఁడును, ఇంద్రియజయముగలవాఁడును,

సమస్తభూతములకు నాత్మయైనవాఁడును నేనేయనుజ్ఞానముగలవాఁడు (లోకవటనకొఱకు)కర్మచేయుచున్నను కర్మబద్ధుఁడు కాఁడు.

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గంత్యక్త్వాఽఽత్మశుద్ధయే॥

Yogis, having abandoned attachment, perform action only by the body, by the mind, (Manah) by the Reason, (Buddhi) and even by the senses, for the purificatin of the selt.

యోగులు దేహముచేతను మనస్సుచేతను, బుద్ధిచేతను, మమకార శూన్యములైన యింద్రియములచేతను, అన్నివ్యాపారములయందును మమత్వములేనివారలై ఫలసంగము విడిచిపెట్టి చిత్తశుద్ధికొఱకు కర్మను చేయుచున్నారు.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥

The harmonised man, having abandoned the fruit of action, attaineth to the eternal

Peace; the non-harmonised, impelled by desire, attached to fruit, are bound.

ఈశ్వరునికొఱకు కర్మములను జేయుచున్నాను, వానిఫలము నాకుఁగాదని చిత్తసమాధానముగలవాఁడై కర్మలనుజేయుచున్నవాఁడు, కర్మఫలమువదలిపెట్టి మోక్షమును క్రమముగాఁ బొందుచున్నాఁడు. అట్టిఫలముకొఱకు తాను కర్మను జేయుచున్నాననుబుద్ధితోఁ గర్మజేయువాఁడు ఫలముతోఁగూడుకొన్నవాఁడై బద్ధుఁ డగుచున్నాఁడు.

శ్లో॥ నప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్ । స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణిస్థితః॥

50

With Reason (Buddhi) firm, unperplexed, the knower of the ETERNAL established in the ETERNAL, neither rejoiceth on obtaining what is pleasant, nor sorroweth on obtaining what is unpleasant.

మేలుగలిగినచో సంతసమును, కీడుకలిగినచో దుఃఖమును బొందఁదగదు సమస్తభూతములయందున్న యాత్మ యొక్కఁడే నిశ్చయమనెడి సందేహములేని బుద్ధిగలిగి మోహములేనివాఁడవు బ్రహ్మజ్ఞాని బ్రహ్మమందే యుండును. అనఁగా సర్వకర్మసన్యాసియగును.

ఆత్మసంయమ యోగో నామ షష్ఠోధ్యాయః.

శ్లో॥ శనై శ్శనై రుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనఃకృత్వా న కించిదపి చిన్తయేత్॥

## THE YOGA OF SELF-SUBDUAL.

Little by little let him gain tranquill ty, by means of Reason (Buddhi) controlled by steadiness; having made the mind(Manah)abide in the SELF, let him not think of anything.

ధైర్యముతోఁ గూడిన బుద్ధిచేత మనస్సును మెల్ల మెల్లఁగా నిర్వ్యాపా రమైన(విషయములనుండి త్రిప్పఁబడిన)దానిఁగాఁ జేయవలసినది. ఈ సమ స్తమును నాత్మయే యని తలచుచు నాత్మకు వేఱగుదానిని జింతింపవలెను.

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి।

He who seeth Me everywhere, and seeth everything in Me, of him will I never lose hold, and he shall never lose hold of Me.

ఎవ్వఁడు నన్ను సర్వమునందును, అట్లే నన్ను సర్వభూతములయం-
దు వ్యాపించిన వానినిగాఁ జూచుచున్నాఁడో? బ్రహ్మమొదలుకొని పి
పీలికా పర్యంతమైన జగత్తును నాయందు సూత్రమందు మణులవలెఁ
గ్రుచ్చఁబడిన దానినిగాఁ జూచుచున్నాఁడో? అట్టి యోగ్ని వొక్క-వానిని
గాఁ జూచునట్టి వానికి నేనుమఱుఁగుపడను. వాఁడు నాకు దూరస్థుఁడు
కాఁడు.

శ్లో॥ ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాఽత్మానమవసాదయేత్
ఆత్మైవహ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః ॥

Let him raise the self by the SELF and not let the self become depressed; for verily is the SELF the friend of the self, and also the SELF the self's enemy;

పురుషుఁడు సంసారసముద్రమందు మునిఁగినతనను దానే పైకి లేవఁదీసికొనవలయుఁగాని యధోగతిపాలు కానివ్వఁదగదు. తనకు బంధువుఁడును శత్రువును దానయగును.

శ్లో॥ యోగీయుఞ్జీత సతతమాత్మానం రహసిస్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥

౨5

Let the Yogî contantly engage himself in yoga, remaining in a secret plece by himself, with thought and self subdued, free from hope and greed.

యోగియగువాఁడు, ఏకాంతములగు పర్వతగుహాదులయందుండి సాహాయ్యములేనివాఁడగుచు మనస్సునీశ్వరునియందు నిలిపి యాశలేనివాఁడై దేనిని దీసికొనని వాఁడై యెల్లప్పుడు మనస్సు సమాధానము చేయవలసినది(అనగా నిశ్చలము చేయవలయును)

శ్లో॥ తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే॥

There, having made the mind (Manah) one-pointed, with thought and the functions of the senses subdued, steady on his seat, he should practise yoga for the purification of the self.

యోగి పరిశుద్ధస్థలంబునఁ గృష్ణాజినము దర్భాసనము మొదలగునా
సనములందుఁగూర్చుండి సమస్తవిషయములనుండి యింద్రియములను

మ్మును మరలించి యేకాగ్రముగాఁ జిత్తశుద్ధికొఱకు యోగమును జేయ వలయును.

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః॥

As a lamp in a windless place flickereth not, to such is likened the Yogi of subdued thought, absorbed in the yoga of the SELF.

నియతమైనమనస్సు గలిగి యోగానుష్ఠానముఁ జేయుచున్నట్టి యోగియు

కర్మదుదనన్ను వాయువులేనట్టిస్థలమునందున్నదీపమువలె చలింపకుండును
డును.

శ్లో॥ యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీవిగతకల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖమశ్నుతే॥

The Yogi who thus, ever harmonising the self, hath put away sin, he easily enjoyeth the infinite bliss of contact with the ETERNAL.

యోగియైనవాఁడు ఈ ప్రకారముగా నెల్లప్పుడును. ఆత్మ చింతన

చేయుచున్నవాఁడై పాపపుణ్యరహితుఁడై యనాయాసమ్ముగా నిరతిశ
యమయిన(సాక్షాత్కారరూపము) బ్రహ్మానందమును బొందుచున్నాఁడు.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥

The self, harmonised by yoga, seeth the SELF abiding in all beings, all beings in the SELF; every where he seeth the same.

సమస్తభూతములయందును దనను, తనయందు సమస్తభూతముల

ను జూచువాఁడును, యోగములోఁ గూడుకొన్నవాఁడును. సర్వము నొక్కటియగు బ్రహ్మముగఁ జూచువాఁడును బ్రహ్మముఁ జూచును. (అనగా బ్రహ్మమగును.)

విజ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః.

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖంమనోబుద్ధిరేవచ।
అహఙ్కారఇతీయం మేభిన్నా ప్రకృతిరష్టధా॥

## THE YOGA OF DISCRIMINATIVE KNOWLEDGE.

Earth, water. fire, air, ether, Mind, (Manah)

and Reason (Buddhi) also and Egoism (Ahankara) these are the eightfold division of My nature. (Prakriti, matter in the widest sense of the term, in-cluding all that has extension.

పృథివి, సూక్ష్మరూపమైన యుదకములును, సూక్ష్మరూపమైన యగ్నియు, సూక్ష్మరూపమైన వాయువును, సూక్ష్మరూపమైనయాకాశమును, అహంకారతత్త్వమును మహాతత్త్వమును, అవ్యక్తతత్త్వమనియీప్రకారము గాఁజెప్పబడి నటువంటిన్ని, ఈశ్వరుడనైన నాసంబంధిని యగుమాయాశక్తి యెనిమిది విధములను బొందియున్నది.

శ్లో॥ నాహంప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః।
మూఢోఽయంనాభిజానాతి లోకోమామజమవ్యయమ్॥

Nor am I of all discovered; enveloped in My creation-illusion (Yoga-Maya, the creative power of Yoga, all things being the thought-forms of the One.) This deluded world knoweth Me not, the unborn, the imperishable.

నన్ను భజింపనివారికి నేను కనఁబడను. యోగమాయలోఁ గప్పబడిన

ది గనుక నే యీలోకము నన్ను బుట్టుక లేనివానినిగాను నాశము లేనివానిగాను దెలిసికొనుటలేదు.

అక్షరపరబ్రహ్మయోగోనామ అష్టమోఽధ్యాయః.

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్మామనుస్మరన్।
యఃప్రయాతిత్యజన్దేహం స యాతిపరమాంగతిమ్॥

## THE YOGA OF, THE INDESTRUCTIBLE SUPREME ETERNAL.

"Aum!" the one-syllabled Eternal, recit-

ing, thinking upon Me, he who goeth forth, abandon-ing the body, he goeth on the highest path.

ఓమనియెడి నామవాచకమైన ప్రణవమును తదర్థరూపుడనైన నన్ను స్మరించుచు ఎవఁడు శరీరమును విడుచుచున్నాఁడో యట్టివాఁడు నన్ను బొందుచున్నాఁడు.

శ్లో॥ పురుషస్స పరః పార్థ! భక్త్యాలభ్యస్త్వనన్యయా।
యస్యాన్తస్స్థానిభూతాని యేన సర్వమిదం తతమ్॥

65

He, the highest Spirit, (Purusha) O Pârtha, may be reached by unswerving devotion to Him alone, in whom all beings abide, by whom all This (This, the universe, in opposition to THAT, the source of all.) is pervaded.

ఓయర్జునా! సమస్తభూతములు నెవరియందున్నవో యెవనిచేత సమస్తము వ్యాపింపఁబడినదో యాపరమపురుషుఁడు. ఆత్మవిషయమైనట్టియు జ్ఞానరూపమైనట్టియు భక్తిచేతఁబొందఁదగినవాఁడు.

రాజవిద్యారాజగుహ్యయోగో నామ నవమోఽధ్యాయః.

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

## THE YOGA OF THE KINGLY SCIENCE AND THE KINGLY SECRET.

To those men who worship Me alone thinking of no other, to those ever harmonious, I bring full security.

ఎవ్వరు పరమాత్మనైన నాకంటె వేఱుకానివారలై తమయాత్మస్వ
రూపు నీగాఁ జింతించుచున్నారో యట్టి నిరంతరమదీయధ్యాననిష్ఠలోఁ
గూడుకొన్నవారియొక్క యోగక్షేమము (అనఁగా లేనిదానిని బొం
దించుటయుఁ బొందఁబడినదానిని రక్షించుటయును) జేయుచున్నాను.

విభూతియోగోనామదశమోఽధ్యాయః

శ్లో॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్॥

## THE YOGA OF SOVEREIGNTY.

But what is the knowl ge of all these details to thee, O Arjuna? Havi pervaded this whole universe with one fragment of Myself, I remain.

ఓఅర్జునా? నీవు యిదివరకు విశేషముగా నీపూర్వోక్తప్రకారముగా తెలియఁబడినదానిచేత నేమి ప్రయోజనము సంగ్రహముగా జెప్పుచున్నా నువినుము. సమస్తమహాప్రపంచమును నాయొక్క యేకాంశముచేత విశేషముగా వ్యాపించియున్నాను.

విశ్వరూపసందర్శన యోగోనామ ఏకాదశోఽధ్యాయః

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్।
బహూదరం బహుదంష్ట్రాకరాలం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్॥

## THE YOGA OF THE VISION OF THE UNIVERSAL FORM.

Thy mighty Form, with many mouths and eyes, Long-armed, with thighs and feet innumerate, Vast-bosomed, set with many fearful teeth, The worlds see terror-struck, as also I.

ప్రమాణాతీతమైనటువంటినీన్ని, అనేక ముఖములు నేత్రములు కలిగినటువంటినీన్ని, అనేకములైన చేతులు, తొడలు, పాదములు, కలిగినటువంటినీన్ని, అనేకములైన యుదరములు గలిగినటువంటినీన్ని, అనేకములైన కోరలచేత భయంకరమైనటువంటి నీయొక్క రూపమును జూచి ప్రాణు

లు మిక్కిలి వ్యథతోఁగూడికొన్నవారలగుచున్నారు. నేనుమునే ప్రకారము వ్యథను బొందుచున్నాను.

భక్తియోగోనామద్వాదశోఽధ్యాయః.

శ్లో॥ అనపేక్షశ్శుచిర్దక్షఉదాసీనో గతవ్యథః।
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్సమే ప్రియః॥

## THE YOGA OF DEVOTION.

He who wants nothing, is pure, expert, pas-

sionless, untroubled, renouncing every undertaking, he, My devotee, is dear to Me.

దేహేంద్రియ విషయసంబంధాదులయందపేక్షలేనివాడును లోపలను, వెలుపలను, పరిశుద్ధతగలవాడును, అనేక కార్యములు సంప్రాప్తములై వచ్చిన వానిని యోగ్యముగా బ్రవర్తింపచేయుటకు సమర్థుడును, శత్రుమిత్రపక్షభేదబుద్ధిని బొందకయుండువాడును, భయరహితుండును ఫలేచ్ఛచేతను నారంభించనటువంటి సమస్తకార్యారంభములను వదలినవాడునై యెవ్వడు నాయందుభక్తిగలవాడో వాడు నాకు ప్రియుండు.

క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః.

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే॥

## THE YOGA OF THE DISTINCTION BETWEEN THE FIELD AND THE KNOWER OF THE FIELD.

As the omnipresent ether is not affected, by reason of its subtlety, so seated everywhere in

the body the SELF is not affected.

ఏప్రకారముగా సర్వవ్యాపియైయు యాకాశము సూక్ష్మభావముచేత నాశవస్తువులతోను సంబంధమునుబొందక దేహమునందంతటను వ్యాపించియున్న యాత్మ యీప్రకారముగా దేహ చేతను సంబంధింపబడదు.

శ్లో॥ సర్వతఃపాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి॥

Everywhere THAT hath hands and feet, everywhere eyes, heads, and mouths; allhear-

ing, He dwelleth in the world enveloping all.

అబ్రహ్మాదులంతటను కాలుచేతులు నేత్రములు శిరస్సు ముఖము చెవు
లు గలదియై లోకమునందంతట వ్యాపించియున్నది.

శ్లో॥ యావత్సఞ్జాయతే కిఞ్చిత్సత్త్వం స్థావరజఙ్గమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ॥

Whatsoever creature is born, immobile or mobile, know thou, O best of the Bhàratas, that it is from the union between the Field

and the Knower of the Field.

ప్రపంచమందు స్థావరజంగమ (Unmoving) రూపమైన యే యే వస్తువు పుట్టుచున్నదో యదియంతయు క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగ సంబంధమువలనఁ బుట్టుచున్నది. క్షేత్రమన దేహాదిరూప సమూహము (body and Senses) క్షేత్రజ్ఞుడనఁ దత్క్షేత్రము నెఱుఁగువాఁడు.

గుణత్రయవిభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః.

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి॥

# THE YOGA OF SEPARATION FROM THE THREE QUALITIES.

He, O Pandava, who hateth not radiance, nor outgoing energy, nor even delusion, when present, nor longeth after them, absent:

సత్త్వగుణకార్యమైన ప్రకాశమును, రజోగుణకార్యమైన ప్రవృత్తిని, తమోగుణకార్యమైన యవివేకమునుపట్టి యీయంతఃకరణ ధర్మములు తన కగునప్పుడెప్పుడును, వానిద్వేషింపడో, యీవృత్తులవి దిపోయినప్పుడు వానిగోరడో వాడు గుణాతీతుడనబడుచున్నాడు.

అథాతః పురుషప్రాప్తియోగోనామ పఞ్చదశోఽధ్యాయః.

౧౪। అహంవై వైశ్వానరో భూత్వా ప్రాణినాందేహమాశ్రితః

ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నంచతుర్విధమ్

## THE YOGA OF ATTAINING THE SUPREME SPIRIT.

I, having become the Fire of Life (Vaisvanara) take possession of the bodies of breathing things, and united with the life-breaths (Prana

and Apana) I digest the four kinds of food.

నేను ఉదరస్థమైన యగ్నివ్యాహూడనై ప్రాణులయొక్క దేహము నాశ్రయించి ప్రాణాపానములతోఁ గూడుకొన్నవాఁడనై చతుర్విధమైన యన్నమును బచనచేయుచున్నాను.

దైవాసురసంపద్విభాగ యోగోనామ షోడశోఽధ్యాయః

శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥

# THE YOGA OF DIVISION BETWEEN THE DIVINE AND THE DEMONIACAL

He who having cast aside the ordinances of the Scriptures, followeth the promptings of desire, attaineth not to perfection, nor happiness, nor the highest goal.

ఎవ్వడు చేయఁదగినదాని చేయఁగూడనిదాని [illegible] మును, విడిచి తనయిష్టప్రకారము నడుచుకొనుచున్నాఁడో యతఁడిహ లోకసౌఖ్యమును గాని పరలోకసౌఖ్యమును గాని పొందఁడు,

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
కామః క్రోధ స్తథాలోభ స్తస్మాదేత త్త్రియంత్యజేత్ ॥

Triple is the gate of this hell, destructive of the self-lust, wrath, and greed; therefore let man renounce these three.

కామము(lust)క్రోధము(wrath)లోభము(greedపరధనాపేక్ష)అనునీమూడును నరకమునకుద్వారములు ఆత్మనాశకములు(destructive of the Self) కానఁనీమూటిని వదలిపెట్టవలయును.

శ్రద్ధాత్రయవిభాగయోగోనామ సప్తదశో౽ధ్యాయః

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చయత్।
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయంతప ఉచ్యతే॥

## THE YOGA OF THE DIVISION OF THREEFOLD FAITH.

Speech causing no annoyance, truthful, pleasant and beneficial, the practice of the study of the Scriptures, are called the austerity

of speech.

ప్రాణులకు దుఃఖకరము కానటువంటిదిన్నీ యథార్థమైనటువంటిదిన్నీ ప్రస్తుతి ముమనస్సుకిష్టమైనటువంటిదిన్నీ, ఉత్తరకాలమునందు మేలునుకలిగించు నట్టిదే మాటగలదో యదియును. వేదమును జదువుటయును వాగ్రూపమైన తపస్సని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ మనఃప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః।
భావసంశుద్ధి రిత్యేతత్తపో మానసముచ్యతే॥

Mental happiness, equilibrium, silence, self-

control, purity of nature—this is called the austerity of the mind (Manah).

మనస్సుయొక్క నైర్మల్యము (మంచివృత్తి) మంచిమనస్సు (good heartedness) మౌనము (Silence) మనస్సు నిగ్రహించుట (Self-control) కపటములేనివృత్తి (Purity of nature) ఇది మానస తపస్సనఁబడును.

మోక్షసన్న్యాసయోగోనామ అష్టాదశోఽధ్యాయః

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।

౬౫

అహంత్వాసర్వపాపేభ్యోమోక్షయిష్యామిమాశుచః॥

# THE YOGA OF LIBERATION BY RENUNCIATION.

Abandoning all duties (Dharmas) come unto Me alone for shelter; sorrow not, I will liberate thee from all sins.

ధర్మాధర్మరూపములైన సమస్తకర్మలను, సన్యసించి (వర్జించి) ఒకఁడనైనట్టువంటియు సర్వేశ్వరుఁడనైనట్టువంటియు నన్ను రక్షకుని

గా నాశ్రయింపుము. నేను సర్వకర్మత్యాగపూర్వకము గా శరణాగతుఁ డనైననిన్ను, బంధహేతువులైన సకలధర్మాధర్మములనుండి యథార్థమైన నాయొక్క స్వరూపమును బ్రకాశింపఁ జేయుటచేత ముక్తుఁడనుగాఁ జేయుచున్నాను.

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదంతతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధింవిన్దతిమానవః॥

He from whom is the ( manation of beings, by Whom all This is pervaded, by worshipping

Him in his own duty (Karma) a man winneth perfection.

భూతములన్నియు నెవనివలనఁబుట్టినవో యెవనిచే నీప్రపంచము వ్యాపింపఁబడినదో యాపరమాత్మను దమతమవర్ణాశ్రమ (In has own duty) విహితములైనకర్మలచేత నారాధించి (పూజించి) మనుష్యులు జ్ఞాననిష్ఠా యోగ్య (Qualified for the devotion Knowledge or winneth perfection) లగుచున్నారు.

ఇది శ్రీ భగవత్పాదాచార్య శంకర భాష్యార్థ సహిత భగవద్గీతారత్న సంగ్రహము సమాప్తము.

సర్వేజనాస్సుఖినోభవన్తు.

Peace be to all worlds.

ఓమ్తత్సత్.



ఓమ్

నమ శ్రీ పరమాత్మనే

——:0:——

# Sacred Tenets of the Reformed Vedic Religion suited to the Modern times.

——0——

నవనాగరికులకు ననుకూలించునటుల సంస్కరింపఁబడిన వేదసమ్మతములగు హిందూమత పవిత్ర సిద్ధాంతములు.

1 సర్వభూతములందు సమత్వమును, మతాంతరాన్యమతసహిష్ణుత్వమును, భ్రాతృత్వమునుంచుటయును. ఇవి సర్వాంగీ భూతదయ (శ్రీశంకర)

2 సచ్చిదానందస్వరూపుఁ డగు సర్వేశ్వరు నెల్లపుడు నుపాసించుట మనుజునకు విధియు అవశ్యకమును, అనువమ్మకము. (అనఁగా భగవంతునే కర్తృనిర్గుణత్వవిశిష్టునిగ భావించిధ్యానించుట)

3 ముక్తిసాధనములగు వేదమును, పరమ స్తసద్గ్రంథములను జదువుటయు, వినుటయు హిందువులందఱికిని బరమధర్మము.

4 సత్యమునవలంబించుటకును, ననత్యముద్యజించుటకును, సర్వదాయ

ధ్యానముఁ జేయుట.

6 ఆయా కార్యములయం దారతమ్యమునుబట్టి ధర్మాధర్మవిచారణ చేయుట.

(1) శారీరక (Physical)
(2) మానసిక (Intellectual)
(3) సాంఘిక (Social)
(4) ఆధ్యాత్మిక (Spiritual)
(5) భౌతిక (Material)*

*ములయిన సద్ధర్మములయొక్క యౌన్నత్యములకు శక్తికొలది పాటుపడుట.

7 అన్ని విషయములయందు యోగ్యప్రవర్తన గలిగియుండుట.

8 అవిద్యా (అజ్ఞానము) నాశనము జేసివిద్యను (జ్ఞానమును) వృద్ధిప
ఱుపవలయును.

9 పరశ్రేయస్సమానమునను భవమువలనఁగనుపరుచుట. మఱియునం
దులకై తనలాభమునుగాడఁ బరిత్యజించుయోగ్యత కలిగియుండుట.

(Selflessness is the gist of all religions)

10 త్రికరణశుద్ధి:—అనఁగా మనోవాక్కాయకర్మలయందుఁ బరిశుద్ధ
లుగానుండుటకై శక్తివంచన లేకుండ బ్రయత్నింపవలయును.

11 ప్రతిదినమునుమాటలయందును, పాటలయందును, జదువునందును,

నపరిశుద్ధభాషనుపయోగింపకుండవలయును.

12 జాడ్యమందుడప్పపొగాకు మొదలయిన(యాత్మవ్యక్తికిహానిచేసెడు) హానికరములయినపదార్థములఁద్యజించుట.

13 బహ్వానర్థములకు మార్గమగునట్టి వ్యభిచారమునకు మనోవాక్కాయకర్మలయందుఁగూడ నవకాశము నెప్పుడియ్యకుండుట. వ్యభిచారమువలనమిగులఁదేహోపహానికలుగును. కాననావృత్తివలనజీవించువేశ్యాంగనాదినాట్యాదులనుజూడనని, నిష్కర్ష చేసికొని తానట్లనుష్ఠించుచు, నితరులకునట్లు నేర్పుట

పరమార్థతత్త్వజ్ఞానోదయము చేత ప్రత్యక్షదర్శన ప్రాప్తి సంఘటిల్లఁ కాంక్షిల్లు సద్ధర్మానుష్ఠానపరులయిన మనుజులు నిరవధిః పరమకృపాసముద్రుండయిన సర్వేశ్వరుని, నిరంతరము ధ్యానించుచుఁ బరబ్రహ్మభావమునఁ బొందుదురు.

ఓం తత్సత్

---

95

శ్లో॥సహృదయం సామనస్యం అవిద్వేషంకృణోమివః।
అన్యోన్యమభిహర్యత వత్సంజాతమివాఘ్న్యయా।
అనువ్రతః పితుః పుత్రో మాత్రాభవతుసమ్మనాః।
జాయాపత్యేమధుమతీం వాచంవదతుశాంతివాం।
మాభ్రాతాభ్రాతరంద్విక్షన్ మాస్వసారముతస్వసా।
సమ్యంచస్సవ్రతాభూత్వా వాచంవదతభద్రయా॥

అధర్వణవేదము 3-30.

సీ॥ వహిమీషునంబులమచ్చరంబులు లేక,
నొకరొకరునుగూడియుంద్రుగాత।
అప్పుపుట్టినదూడనా వెంతప్రేమించు,
నట్లుమీకన్యోన్యమలరుగాత।
కొడుకయ్యయడభక్తిఁగడఁగితల్లికినొక్క,
యుడదతోఁగమెప్పినడరుగాత।
తీపిమాటలభర్తకేవుమీరగభార్య,
యను!   వతియాచునాడుగాత।

అన్నదమ్ములంతనక్కలు చెల్లెండ్రు।
నొక్కఁడెందమొప్పయొకరికొకరు।
పరమదయదలిర్పనురువైరములులేక।
బరగుచుండ్రుగాతగరిమతోడ।

శ్లో॥ బ్రహ్మనిష్ఠో గృహస్థః స్యాత్ । తత్త్వజ్ఞాన పరాయణః।
యద్యత్కర్మప్రకుర్వీత । తద్బ్రహ్మణిసమర్పయేత్ ॥
(మహానిర్వాణతంత్రము 8వ అ 22వ వాక్యము.)

క॥ ధరగేన్నుబ్రహ్మనిష్ఠా।
పరుఁడాత్మజ్ఞానఘనతఁ రగియూ నేయో।
పరకర్మలుఁ జేసినవవి।
పరమాత్మనికర్పణముగ గావింపవలెన్॥
ఓమ్‌శాంతి ॥ శాంతి శ్శాంతిః హరిః ఓమ్.

☞ ముద్రణ స్ఖాలితములింకనుగలవు. అవిక్రమము
గా రెండవతూరిదిద్దఁబడెను. ఇచ్చటఁగొన్ని మాత్రముఁ దెలి
య చేయఁబడుచున్నవి. జనులుమన్నింపప్రార్థితులు

# శుద్ధాశుద్ధపత్రిక.

—:O:—

| పేజీ. | పంక్తి | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 7 | బయ్యో | బయ్యోడిని |
| 2 | 2 | 18 | 62 |
| ,, | 3 | లిత | పిత |
| 3 | 3 | విదు | విధు |
| 1 | 9 | కృష్ణుడుడనురజ్జని | కృష్ణుడర్జునుని |
| 2 | 1 | తత్త్వజ్ఞామున | తత్త్వజ్ఞానమును |

| | | | |
|---|---|---|---|
| 2 | 2 | నద్వైక సమతను. | నద్వైతమతమును |
| 4 | 4 | అర్జునః | అర్జునుని |
| | 3 | బాహ్య | బాహ్య |
| ౭ | 6 | స్వధర్మాష్ఠాన | స్వధర్మానుష్ఠాన |
| 9 | 1 | కాని | కాక |
| 2 | 3 | అర్జున | ...... |
| 3 | 2 | both | doth |
| 3 | 3 | uuborn | unborn |
| 6 | 6 | attacchments | attachments |

| | | | |
|---|---|---|---|
| 11 | 1 | జ్ఞానము | • |
| 34 | 4 | మనా | మనసా |
| 37 | 1 | ప్రయోజనలేదు | ప్రయోజనములేదు |
| ,, | 3 | సంబగ | సంబంధ |
| ,, | 5 | ఫలయొక్క | ఫలముయొక్క |
| 40 | 2 | faih | faith |
| 42 | 3 | యొసాధనము | యేసాధనము |
| ,, | 9 | భలము | ఫలము |
| 44 | 5 | ధ్యాయ | ధాయ |

| | | | |
|---|---|---|---|
| 2 | 2 | నద్త్వైతమముతను. | న ద్వైతమతమును |
| [illegible] | 4 | అర్డనుని | అర్జునుని |
| 4 | 3 | బావ్యా | బావ్యో |
| [illegible] | 6 | స్వథర్మాత్స్థాన | స్వధర్మానుష్ఠాన |
| 9 | 1 | కాని | కాక |
| 2 | 8 | అర్జున | |
| 3 | 2 | both | doth |
| 3 | 3 | uuborn | unborn |
| 6 | 6 | attacchments | attachments |

| | | | |
|---|---|---|---|
| 11 | 1 | జ్ఞానము | ...... |
| 34 | 4 | మనా | మనసా |
| 37 | 1 | ప్రయోజనలేదు | ప్రయోజనములేదు |
| ,, | 3 | సంబగ | సంబంధ |
| ,, | 5 | ఫలయొక్క | ఫలముయొక్క |
| 40 | 2 | faih | faith |
| 42 | 3 | యొసాధనము | యేసాధనము |
| ,, | 9 | భలము | ఫలము |
| 44 | 5 | ధ్యాయ | ధాయ |

| | | | |
|---|---|---|---|
| 45 | 4 | శుద్ధి | శుద్ధి |
| 54 | 6 | ఁగావి | |
| 55 | 7 | మనన్సు | మనస్సు |
| 70 | 6 | అనేకయ్యలైన | అనేకములైన |
| 79 | 2 | సువరస్త | సుఃరక్షి |
| ,, | 4 | బచన | బచనము |
| 86 | 6 | విద్విత | విద్వత |
| 95 | 6 | చే్రయా | ఛ్రయా |
| 96 | 7 | కేవు | కేపు |

శ్రీరాజారామ •(దైవస్తుతి.)• మోహనరాయ్

పల్లి॥ విగతవిశేషం, జనితాశేషం, సచ్చిత్సుఖపరిపూర్ణమ్.

అనుప॥ ఆకృతివీతం, త్రిగుణాతీతం, స్మరపరమేశం తూర్ణమ్.

చర॥ గచ్ఛదపాదం, విగతవివాదం, పశ్యతి నేత్ర విహీనమ్;
శృణ్వదకర్ణం, విరహితవర్ణం, గృహ్ణాదహస్త మపీనమ్;
వేదైర్గీతం, ప్రత్యగభీతం, పరాత్పరం చైతన్యమ్;
అజరమశోకం, జగదాలోకం, సర్వస్యైక శరణ్యమ్;
వ్యాప్యాశేషం, స్థితమవిశేషం, నిర్గుణమపరిచ్ఛన్నమ్;
వితతవికాసం, జగదావాసం, సర్వోపాధివిభిన్నమ్.

## ఈశ్వరలఘుధ్యానపద్ధతి

స్థానము. ఏకస్థానము, ఏక ఆసనము

కాలము. ఏకకాలము, సమాన సమయము

అచలాసనస్థ (అచల-అవయవములు) మన స్సును సర్వేంద్రియ వ్యాపారములనుండి మరలించి పర మాత్మయందు నిలుపుట.

ఉద్బోధన (అభ్యర్థించి విసర్జన, In-vocation వేడుకోవడము)

ఆరాధన (1) సత్యం, (2) జ్ఞానం, (3) అనన్తం నిర్గుణము, (4) శివం (లీలలు,) (5) అద్వైతం, (6) శుద్ధం (అపాప విద్ధం) (7) ఆనన్దం (అమృతం, శాన్తం)

ధ్యానం. దర్శనము. పరబ్రహ్మప్రతిపాదకమ

ప్రార్థన. ను గాయత్రిమంత్రముతో ప్రా

శాంతి పాఠము. రంభింపవలయును.